






# మార్చి వైశ్యప్రబోధిని 1998

[illegible]

| | | Frequency | Fare |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 2,000 |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 500 |
| 3 | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 400 |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | 1,900 |

Fare includes complimentary Dormitary accommodation and transport/ Guide charges. Tariff for Tour No.4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హోటల్ సదరన్"లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్ లోని అమరావతి/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిశెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

## Southern Travels/Hotel Southern

**(Recognised by Department of Tourism, Govt. of India, New Delhi.)**

**ఢిల్లీ లోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ**

**18/2, Arya Samaj Road, WEA Karolbagh, New Delhi - 110 005.**

**(Phones : 5722210 (6 Lines); 5739508, 5782932)**

**Our branches**

1. Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones : 223658, 227233)
2. Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones : 2267040; 2262633)
3. Hotel Howrah Complex, Opp. Madras Central Railway Station, Madras - 600 003 (Phones 564864, 585253)
4. No 10, Swarnalok Complex, Opp. Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones . 62227, 66624)
5. Pavan Palace, Ground Floor, Opp T S R Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016 (Phone 545565, 541099)

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — ఆధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)**

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)**

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్.బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేరు సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి

యన్.బి. . ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి. తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ                                                  యక్కలి బాలరత్నం

అధ్యక్షులు          మరియు కార్యవర్గ సభ్యులు          ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



స్థాపితము

1969



సంపుటి

29



సంచిక

7



మార్చి - 1998





సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి





ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ : 24911, 25025.


సంపాదకీయం

## 12వ లోక్‌సభ ఎన్నికలు చెప్పిన గుణపాఠం

గత (ఫిబ్రవరి) నెలలో భారతదేశ 12వ లోక్‌సభకు జరిగిన ఎన్నికలు - రాష్ట్రాలలో అధికారాన్ని చెలాయిస్తున్న పలు రాష్ట్రప్రభుత్వాలకు గట్టి గుణపాఠం చెప్పాయి.

ఈ గుణపాఠం అధికారంలోఉన్న ఒక రాజకీయ పక్షానికేకాక ఇంచుమించుగా భారతదేశములో అధికారంలో ఉన్న రాజకీయపక్షాలన్నింటికీ కూడ.

తమిళనాడులో డి.యం.కె, ఒరిస్సాలో కాంగ్రెస్, మహారాష్ట్ర, రాజస్థాన్‌లలో భారతీయజనతాపార్టీ, పశ్చిమబెంగాల్‌లో కమ్యూనిస్టుపార్టీఆఫ్‌మార్క్సిస్టు, అస్సాంలో అస్సాంగణతంత్రపరిషత్తు ల పాలనపై ఆయా రాష్ట్రాలలోని ప్రజలు, 12వ లోక్‌సభకు పోటీచేసిన అధికారపక్షం అభ్యర్థులకు చావుదెబ్బగొట్టి, 'ప్రజలు విజ్ఞులు. బాధ్యతను మరచినవారిని క్షమించరు" - అని గట్టిగా హెచ్చరించారు.

ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి అంతగట్టిగా గుణపాఠం చెప్పకపోయినా ఒకమోస్తరుగా హెచ్చరించి చంద్రబాబును ప్రజలు వదలిపెట్టారు.

ప్రజలు తనను హెచ్చరించి వదలిపెట్టినట్లుగా తెలుగుదేశంపక్షం నాయకులూ, ఆంధ్రప్రదేశ్ ప్రధాన సచివులూ చంద్రబాబునాయుడు తప్పక గమనించాలి.

గమనించుటతోబాటు, తనకుగల ఈ రెండేండ్ల పరిపాలనాకాలములో - తన గతపరిపాలనావిధానాన్ని హేతుబద్ధంగా, ఎటువంటి భేషజాలకుపోక విమర్శించుకొని, ముందడుగువేయవలసిన ఆవశ్యకతను కూడ చంద్రబాబు గుర్తించాలి.

జరిగినవి పార్లమెంట్ఎన్నికలే అయినా - జాతీయస్థాయిసమస్యలే ఈ ఎన్నికల్లో ప్రధానపాత్రవహిస్తాయని భావించినా - రాష్ట్రపరిపాలనలోని బాగోగులుకూడ ప్రజలను ప్రభావితంచేస్తాయి అనేది మరోసారి ఋజువైన సత్యం.

రాష్ట్రాన్ని మహోన్నతదశకు తీసుకపోవాలన్న ధ్యేయముతో చంద్రబాబు నాయుడు రోజుకు పద్దెనిమిదిగంటలలకు శ్రమించినాడనుటలో సందేహములేదు అయితే ఆయన ఆలోచలన్నీ కూడ తక్షణప్రయోజనాలకు గురిపెట్టినవికావు. బాబు ఆలోచనలు కార్యరూపముదాల్చి, వాటిప్రయోజనము ప్రజలకు అందాలంటే కొంతసమయం అవసరము. అంతఓపిక ప్రజలకు లేదు. ఈనాటిప్రజలకు కావలసింది తక్షణప్రయోజనము - ఈ సత్యాన్ని బాబు గుర్తించాలి.

ఎప్పుడైనా - ఎక్కడైనా - ఏ ప్రజలకైనా ముఖ్యంగా కావలసినవి కూడు, గూడు, గుడ్డ, వెలుతురు. తమ ఆస్తులకూ, ప్రాణాలకూ రక్షణ.

దురదృష్టవశాత్తూ, ఈనాడు తఖతుపై కూర్చుంటున్న రాజకీయపక్షాలన్నీ కూడ అతి ప్రధానమైన పై నాలుగు అంశాలన్నీ మరచాయి. ఏదేదో ఊహించుకొని, ఏమేమో చెప్తూ, ఏదేదో చేస్తూ, చెప్పేదానికీ చేసేదానికి పొంతన లేకుండా తమ అధికారాలను చలాయిస్తున్నారు ఈనాటి ముఖ్యమంత్రులు. అట్టి వారందరికీ కూడ ఈ ఎన్నికల్లో ప్రజలు గట్టిగుణపాఠాన్ని చెప్పారు అనుటలో అతిశయోక్తిలేదు.

రాష్ట్రాలకూడికే దేశము. దేశములోని రాష్ట్రప్రభుత్వాలు చక్కగా, బాధ్యత ఎఱిగి, రాష్ట్రప్రజల సమగ్రసర్వతోముఖాభివృద్ధిని గురించిన ఆలోచనలతో పనిచేస్తే -.దేశం అంతా బాగుపడుతుంది. కాబట్టి జరిగినవి లోక్‌సభ ఎన్నికలే అయినా, స్థానికసమస్యలుకూడ బలమైన పాత్రవహించాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని అతివలంతా ఎంతో పట్టుదలతో శ్రమించి, సాధించుకున్న మద్యపాననిషేధాన్ని రద్దుపరచుటద్వారా చంద్రబాబునాయుడు అతివల ఆగ్రహాన్ని చవిచూశారు. అట్లే రైతన్నలసమస్యలూ, పెరిగిన విద్యుత్ చార్జీలు ఇత్యాదులు

**మీ ఎల్లరకు వైశ్యప్రబోధిని 'ఉగాది' శుభాకాంక్షలు చెప్తూ ఉంది.**

**మార్చి 15 అమరజీవి-రాష్ట్రపిత శ్రీ పొట్టిశ్రీరాములజయంతి - గుర్తుంచుకోండి.**

# విజయలక్ష్మీధవులు శ్రీ రోశయ్య

పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి, సంపాదకులు,



*(16-2-1998వ తేదీన భారతదేశ 12వ లోక్‌సభకుజరిగిన ఎన్నికల్లో గుంటూరుజిల్లా నర్సరావుపేట పార్లమెంటరీ నియోజక వర్గము నుండీ కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసి, విజేతలై శ్రీ రోశయ్యగారు తొలిసారిగా లోక్‌సభలో ప్రవేశిస్తున్నారు. ఈ సందర్భంగా వైశ్యప్రబోధినీ తరపున శ్రీ రోశయ్యగారికి అభినందనలు తెల్పుతూ, వీరికి మరింత ఉన్నతపదవినీ ఆయురారోగ్య ఐశ్వర్యాలనూ ప్రసాదించమని జగన్మాత శ్రీ వాసవీ దేవిని ప్రార్థిస్తూ శ్రీ రోశయ్యగారి జీవిత విశేషాలను సమగ్రంగా ప్రచురిస్తున్నాము - సంపాదకులు)*

పదవి కొందరికి అలంకారమైతే ఆ పదవికే కొందరు అలంకారమౌతారు. ఈ రెండవ కోవకు చెందిన అతి కొద్దిమందిలో శ్రీ రోశయ్యగారూ ఒకరు. ఒక చక్కని పార్లమెంటేరియన్‌గా ఈయనకు మంచి పేరుంది. ప్రజల మన్నన ఉంది. ప్రతిభ, వ్యుత్పత్తి, సామర్థ్యములు మూడు రాసి పోయగా మూర్తీభవించినవారు శ్రీ రోశయ్య గారు. అందుకే ఆయన అధిష్ఠించిన పదవులన్నింటికీ అలంకారాన్ని చేకూర్చ గలుగుచున్నారు. అనర్గళమూ, ఆకర్షణీయమూ అయిన వాగ్ధాటి, సమయస్ఫూర్తి రెండూ అబ్బిన పరమేశ్వర కృపాలబ్ధులు శ్రీ రోశయ్యగారు.

బహుముఖ ప్రజ్ఞావంతులూ, రాజనీతిజ్ఞులూ అయిన శ్రీ యన్.జి. రంగాగారి శిష్యరికములో వీరు ఉత్తమమైన రాజకీయ విజ్ఞతను సంతరించుకొన్నారు.

శ్రీ రోశయ్యగారు విద్యార్థిదశనుండే ఉద్యమాలకు నాయకత్వం వహించారు. 1952లో ఆంధ్రవిద్యార్థిసమ్మేళనానికి కార్యదర్శిగా ఎన్నికైన శ్రీ రోశయ్యగారు 1953లో ఆంధ్రవిద్యార్థిసంఘఅధ్యక్ష భారాన్ని స్వీకరించి ఆంధ్రోత్సవాలను అతి వైభవంగా జరిపించారు. మూడువందల మంది విద్యార్థులతో కాశ్మీరు, బొంబాయి మొదలగు పట్టణాలకు విజ్ఞానయాత్రలను చేయించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం అనుబంధకళాశాలల ప్రతినిధులకు తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రప్రథమంగా వక్తృత్వపు పోటీలను నిర్వహించింది వీరే. 1953-54లో జరిగిన 'డిటెన్షన్' ఉద్యమంలో శ్రీ రోశయ్యగారు ముఖ్యపాత్రను నిర్వహించారు. 1953-54 సంవత్సరాల మధ్యకాలములో జరిగిన విద్యార్థి ఉద్యమాలన్నింటితో శ్రీ రోశయ్యగారికి సన్నిహిత సంబంధం ఉంది. విద్యాభ్యాసానంతరము

దక్షిణరైల్వేలో 'గార్డు' ఉద్యోగం లభించింది. దాన్ని స్వీకరించక కులవృత్తి అయిన వ్యాపారాన్ని ప్రారంభించారు.

రంగాగారి నేతృత్వములోని 'కృషీ కార్ లోక్ పార్టీ'లో సభ్యులుగా చేరుటతో వీరి రాజకీయజీవితం ఆరంభమైంది. తెనాలిలో జరిగిన రాష్ట్రస్థాయి కృషీకార్‌లోక్‌పార్టీ మహాసభలకు వీరు ఆహ్వానసంఘ కార్యదర్శిగా వ్యవహరించి అతి వైభవంగా ఆ సభలను జరిపించి తమ సామర్థ్యాన్ని తొలిసారిగా ఋజువు చేసుకొన్నారు. తదుపరి రంగాగారు 'కృషీకార్‌లోక్‌పార్టీ'ని రద్దుచేసి స్వతంత్ర పార్టీలో చేరారు. రోశయ్యగారు కూడ స్వతంత్రపార్టీలో చేరి కార్యవర్గ సభ్యులయ్యారు. అతితక్కువ కాలంలో వీరు ఆ పార్టీకి కార్యదర్శులై ఆ పార్టీ ప్రాభవ, వైభవోన్నతులకు శక్తివంచన లేకుండా కృషిచేశారు.

1958లో గుంటూరుడిస్ట్రిక్టు రైస్ మిల్లర్సు అసోసియేషన్ శ్రీ రోశయ్యగారిని ప్రధానకార్యదర్శిగా ఎన్నుకొంది. ఈ పదవిలో ఈయన మూడుసంవత్సరాలున్నారు. ఆ సంస్థ అభివృద్ధిని అందలం ఎక్కించుటకు ఎంతో కృషి చేశారు. బహుముఖంగా ఉన్న ఆ సంస్థసభ్యుల సమస్యల నన్నింటినీ తీర్చి ఆ సంస్థకు ఒక చైతన్యాన్నీ, ఒక గుర్తింపును కలిగించారు.

అంధ్రప్రదేశ్‌రైస్‌మిల్లర్సు అసోసియేషన్ స్థాపకులలో శ్రీ రోశయ్యగారు ముఖ్యులు. ఆ సంస్థకు వీరు దాదాపు పదిసంవత్సరాలు కార్యదర్శిగా కూడ వ్యవహరించారు. రాష్ట్రములోని బియ్యం ఉత్పత్తి పరిశ్రమకు దెబ్బతగులబోయే ప్రతి సందర్భములోనూ ప్రభుత్వాన్ని ధైర్యంగా ఎదిరించి ఆ పరిశ్రమ ఉనికికి దెబ్బ తగులకుండా కాపాడగలిగారు. 1969వ సంవత్సరము ఫిబ్రవరి నెల 3వ తారీఖున "ఆంధ్రప్రదేశ్‌రాష్ట్ర బియ్యంఉత్పత్తి దారుల సభ'ను హైద్రాబాద్‌లో జరిపించి, అప్పటి ముఖ్యమంత్రిని ఆ సభకు ఆహ్వానించి రాష్ట్రములో బియ్యంఉత్పత్తిదారుల సమస్యలను ఆయన దృష్టికి తీసుకపోయారు.

1959లో అప్పటి రాష్ట్రప్రభుత్వము అమ్మకంపన్ను శాఖాధికారులకు గల్లాపెట్టె (క్యాష్‌బ్యాక్సు)ను తనిఖీచేసే అధికారాన్ని కల్పిస్తూ 1956, ఆంధ్రప్రదేశ్‌సాధారణ అమ్మకంపన్నుచట్టానికి ఒక సవరణను ప్రతిపాదించింది. శ్రీ రోశయ్యగారు ఆ ప్రతిపాదనను తీవ్రంగా ప్రతిఘటించి, శాసనం కాకుండా నిరోధించగలిగారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని వీరు రాష్ట్రమంతటా తిరిగి వర్తకసదస్సులను ఏర్పాటు చేసి ఆ ప్రతిపాదన శాసనమైతే వచ్చే ఇబ్బందులను వివరించారు. ఇందుకోసమై 1960లో గుంటూరుజిల్లా వర్తకమహాసభను నిర్వహించారు. ఆ తరువాత విజయవాడలోనూ, విశాఖపట్టణములోనూ జరిగిన రాష్ట్రస్థాయి వర్తకసభల్లో ప్రధాన పాత్రను వహించారు.

వీరు, 1958 నుండీ 1960 వరకూ సెంట్రల్‌రైల్వే జనరల్‌యూజర్స్ కన్సల్టేటివ్ కమిటీ మెంబరుగానూ, 1958 నుండి 1978 వరకూ అమ్మకంపన్నుసలహాసంఘ సభ్యులుగానూ ఉన్నారు. ఆహారకల్తీ నిరోధకచట్టము పేరుతో వర్తకులపై

అధికారులు చేస్తున్నదాడులను ఎదుర్కొనేందుకు 1966లో విజయవాడలో ఒక రాష్ట్రస్థాయి వర్తకసదస్సు జరిగింది. అందుకుగానూ ఏర్పాటైన కార్యాచరణ సంఘానికి శ్రీ రోశయ్యగారు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని, రెండురోజులపాటు రాష్ట్రవ్యాప్తంగా హర్తాళ్లు జరిపించారు. రాష్ట్రములోని ప్రధాననగరాలలో వర్తకసభలను జరిపించి - నిజమైన దోషులను వదలివేస్తూ, నిరపరాధులగు వర్తకులను చిత్రహింసల పాలు చేస్తున్న ప్రభుత్వవిధానాలను ఆ సభల్లో వివరించారు. ఈ విషయంమీద వీరు దిన, వార పత్రికలకు అనేక వ్యాసాలు వ్రాశారు.

అధిక భూమిశిస్తు విధింపుకు నిరసనగా అప్పటి స్వతంత్రపార్టీ ఒక ప్రతిఘటనోద్యమాన్ని చేపట్టింది. శ్రీ రోశయ్యగారు ఈ ప్రతిఘటనోద్యమంలో ప్రధాన భూమికను నిర్వహించారు. - ఈ సందర్భంగా తెనాలి పట్టణములో జరిగిన రైతుప్రదర్శనకూ, సత్యాగ్రహానికీ నాయకత్వము వహించారు. 1969వ సంవత్సరం మేనెల్లో వచ్చిన తుఫాను కోస్తాజిల్లాలకు విశేషనష్టాన్ని కలిగించింది అయినా ప్రభుత్వము "ధాన్యపు లెవీ"ని రద్దు చేయలేదు. శిస్తు రెమిషన్‌ను ఇవ్వలేదు. శ్రీ రోశయ్యగారు రాష్ట్రప్రభుత్వము వద్దకు రాయభారాన్ని నడిపి, తుఫాను తాకిడికి దెబ్బతిన్న ఆంధ్రప్రాంతరైతులకు 'లెవీ'ని రద్దు చేయించుటతోబాటు శిస్తురెమిషన్‌ను కూడ వచ్చేలాగున కృషి చేశారు. తెనాలిలో రెండవసారి జరిగిన రైతుయాత్రకూడ వీరి నాయకత్వములోనే జరిగింది.

1967లో మనరాష్ట్ర శాసనసభకు జరిగిన సాధారణఎన్నికల్లో చీరాలశాసనసభా నియోజకవర్గము నుండీ స్వతంత్ర అభ్యర్థిగా అప్పటి కాంగ్రెసుఅభ్యర్థి శ్రీ ప్రగడకోటయ్యగారితో పోటీచేసి బహు స్వల్పతేడాతో విజయలక్ష్మిని పరిగ్రహించలేకపోయారు.

1968వ సంవత్సరములో స్వతంత్ర పార్టీకి చెందిన శాసనసభ్యులు, ఇతరుల తోడ్పాటుతో శాసనమండలికి ప్రప్రథమంగా ఎన్నికై, ఆ సంవత్సరము జూన్ నెల 11వ తేదీన శాసనమండలి సభ్యులుగా ప్రమాణ స్వీకారం చేశారు. రెండవదినము అంటే అదే సంవత్సరము జూన్ నెల 13వ తారీఖున శాసనమండలిలో చర్చకు వచ్చిన అమ్మకం పన్ను సవరణ బిల్లుపై తీవ్రమైన చర్చచేసి ఆ బిల్లు శాసనం కాకుండా నిరోధించుటకు గట్టి ప్రయత్నము చేశారు. అయినా ఆ బిల్లును శాసనమండలి ఆమోదించింది. శాసనమైంది. కానీ రోశయ్యగారు తన ప్రతిఘటనను మానుకోలేదు. రాష్ట్రములోని వర్తకసంఘాలన్నింటికీ పిలుపునిచ్చి, ప్రతిఘటనను సాగించి శాసనములో చేర్చిన ఆ సవరణను ప్రభుత్వముచే ఉపసంహరింపచేశారు.

లోపభూయిష్టంగాఉన్న అప్పటి ఆంధ్ర ప్రదేశ్‌ప్రభుత్వఆహారవిధానంపై శాసన మండలిలో ప్రయోజనాత్మక విమర్శను చేసి కొంత సడలింపును, కొన్ని సవరణలను చేయించారు. ఆ తరువాత 1974లోనూ, 1980 లోనూ ఆంధ్రప్రదేశ్ శాసనమండలికి జరిగిన ఎన్నికల్లో విజయలక్ష్మిని వరించి, 1985 వరకూ శ్రీ రోశయ్య గారు ఆ పదవిలో అవిచ్ఛిన్నంగా కొనసాగారు.

ఆంధ్రప్రదేశ్ శాసనమండలిలో మంత్రి హోదాగల తొలి ప్రతిపక్ష నాయకులు శ్రీ రోశయ్యగారే. ప్రతిపక్షనాయకులుగా ఈయన పోషించిన పాత్ర, వ్యవహరించిన తీరూ అప్పటి పాలకపక్షం గుండెల్లోరైళ్లను పరుగెత్తించింది. మన రాష్ట్రములోని పత్రికలేకాక ఇతర రాష్ట్రాలలోని పత్రికలు కూడ వీరి శాసనమండలి ప్రసంగాలను ప్రముఖంగా ప్రచురించాయి. మన రాష్ట్రములోని మేధావులే కాక, దేశంలోని అనేకమంది మేధావులు కూడ ఈయనను ఎంతగానో ప్రశంసించారు. శాసనమండలి సభ్యులుగా ఉన్నంతవరకూ శ్రీ రోశయ్య గారు హైద్రాబాద్‌నగరములో లభించే చిన్న, పెద్ద పత్రికలు అన్నింటినీ చదివి అవసరమైన విషయాలను వ్రాసుకొని శాసన మండలికి వెళ్ళేవారు. ప్రశ్నోత్తరాల సమయములో అడుగకున్నా శ్రీరోశయ్యగారికి సమయాన్ని కేటాయించేవారు. శాసన మండలిసభ్యులుగా శ్రీ రోశయ్యగారి ప్రవర్తన, ప్రతిపక్షాలకు ఆదర్శంగా ఉండేది. శాసనమండలిలో ఆయన చేసే చర్చ పాలకపక్షానికి కర్తవ్యాన్ని గుర్తుచేసేది.

1977లో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు వీరిని 'ఆంధ్ర ప్రదేశ్‌పారిశ్రామికసదుపాయములసంస్థ'కు అధ్యక్షులుగా నియమించారు. 1979 వరకూ ఆ పదవిలో కొనసాగారు.

1979లో అప్పటి ముఖ్యమంత్రి శ్రీమర్రి చెన్నారెడ్డి గారు తొలిసారిగా శ్రీ రోశయ్య గారిని తమ మంత్రి మండలిలో సభ్యులుగా తీసుకొన్నారు. మధ్యలో కొద్దికాలము మినహా 1982 వరకూ వీరు ఆ అమాత్య పదవిలో ఉన్నారు. 1979 అక్టోబరు నుండీ 1980 నవంబరు వరకూ రాష్ట్ర రహదార్లు, భవనాల శాఖనూ, 1980 డిసెంబరు నుండీ 1982 ఫిబ్రవరి వరకూ రాష్ట్ర రవాణాశాఖనూ, 1982 సెప్టెంబరు నుండి 1982 డిసెంబరు వరకూ "హోమ్" శాఖను వీరు నిర్వహించారు.

1977 నుండీ 1979 వరకూ ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ సంఘానికి కార్యదర్శిగానూ, 1981, 82 సంవత్సరాలలో కోశాధికారిగానూ ఈయన వ్యవహరించారు. ఆ తరువాత 1989లో కొంతకాలము సదరు కాంగ్రెస్ సంస్థకు ఉపాధ్యక్షులుగా ఉండి, మన రాష్ట్రములో కళకోల్పోయిన కాంగ్రెసుపార్టీకి జవసత్వాలను సమకూర్చుటలో ప్రముఖ పాత్ర నిర్వహించారు.

1975వ సంవత్సరం జూన్ నెల 9వ తేదీన హైద్రాబాద్ కాచిగూడాలోని వైశ్య హాస్టల్లో జరిగిన ఒక రాష్ట్రస్థాయి సమావేశములో శ్రీ రోశయ్యగారిని ఇప్పటి ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యమహాసభ అధ్యక్షులుగా వరించింది. అంతవరకూ నామమాత్రావశిష్టంగా ఉన్న ఆ మహాసభ శ్రీ రోశయ్యగారి నాయకత్వములో స్ఫూర్తిని పొందింది. ఆర్థికసుస్థితిలేని ఏ సంస్థ కూడ కలకాలం జీవించలేదు. మహాసభ జీవిత సభ్యులసంఖ్య పదివేలు చేయాలన్న దీక్షను తీసుకొన్నారు శ్రీ రోశయ్యగారు. మరు దినము నుండే ఆ కార్యక్రమాన్ని తీసుకొని రాష్ట్రమంతటా విస్తృతంగా తిరిగి రెండు సంవత్సరాలు పూర్తికాకముందే మహాసభకు ఎనిమిదివేలమందిని జీవితసభ్యులుగా చేర్పించి, మహాసభకు స్వీయశక్తినీ, స్వప్రకాశాన్నీ కలిగించారు. 1977 జనవరి 29, 30 తేదీలలో విజయవాడలో పెద్ద యెత్తున ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభలను అతి గొప్పగా జరిపించి ప్రశంసలందుకొన్నారు.

ఇప్పటి గుంటూరుజిల్లా వేమూరు గ్రామములో వీరు ఒక సామాన్య వైశ్య కుటుంబమైన "కొణిజేటి" వారి యింట జన్మించారు. తండ్రి సుబ్బయ్య, తల్లి ఆదెమ్మ. వీరి సోదరులు శ్రీ సుబ్బరావు గారు. భార్య శ్రీమతి శివలక్ష్మమ్మ గారు, వీరికి ముగ్గురు కొడుకులు. ఒక కుమార్తె

1989 సంవత్సరం నవంబరు నెల 22వ తారీఖున మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభకు జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో శ్రీ రోశయ్యగారు ప్రకాశం జిల్లా చీరాల శాసనసభా నియోజక వర్గము నుండీ కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసి తెలుగుదేశం పతాకం క్రింద పోటీచేసిన తన సమీప అభ్యర్థి శ్రీ చిమటాసాంబుపై 24వేల ఓట్ల మెజార్టీతో విజయలక్ష్మిని గ్రహించి, మొట్టమొదటిసారి శాసనసభలో ప్రవేశించారు.

1989 సంవత్సరం డిసెంబరు నెల 3వ తేదీన అప్పటి ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ మర్రిచెన్నారెడ్డి గారి ప్రధానసచివత్వమున ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రిమండలిలో ఆర్థిక, విద్యుశ్ఛక్తి, శాసనసభావ్యవహారాలు, జౌళిశాఖామాత్యులుగా నియమితులయ్యారు. శ్రీ చెన్నారెడ్డి గారి తర్వాత ఏర్పడిన శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డిగారి మంత్రివర్గములో వైద్య, ఆరోగ్యశాఖామాత్యులుగా 5.8.1991వ సంవత్సరములో నియమితులై 27.9.1992వ తేదీన శ్రీ జనార్ధనరెడ్డి గారు తమ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేయు వరకూ కొనసాగి, తదనంతరం 9.10.1992వ తేదీన ఏర్పడిన శ్రీ కోట్లవిజయభాస్కరరెడ్డి గారి మంత్రివర్గంలో తిరిగి ఆర్థిక, విద్యుశ్ఛక్తి శాఖామాత్యులుగా నియమితులై తదుపరి జరిగిన పదవుల మార్పిడిలో తిరిగి వైద్య, ఆరోగ్య శాఖను చేపట్టి 1994 డిసెంబరు వరకు ఆ పదవిని నిర్వహించారు. రాష్ట్రములో కాంగ్రెసు పార్టీ ఓటమిని చవిచూసిన తర్వాత 1995 జూలై నెలలో అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు, భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు గారు శ్రీ రోశయ్య గారిని ఆంధ్రప్రదేశ్‌కాంగ్రెస్‌సంస్థకు అధ్యక్షులుగా నియమించగా ఆ పదవిని చేపట్టి సమర్థవంతంగా నిర్వహించారు.

16-2-1998వ తేదీన భారతదేశ 12వ లోక్‌సభకు ప్రతిష్ఠాత్మకంగా జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్‌పతాకం క్రింద, గుంటూరు జిల్లా నర్సరావుపేట పార్లమెంటరీ నియోజకవర్గము నుండీ పోటీచేసి 47,890 ఓట్ల ఆధిక్యతతో విజయాన్ని సాధించారు. వీరితో పోటీచేసిన సిట్టింగ్ ఎం.పి. శ్రీ సైదయ్య గారికి 3,27,996 ఓట్లురాగా, శ్రీ రోశయ్య గారికి 3,75,815 ఓట్లు వచ్చాయి.

## మీ సాహిత్యసేవకు మరీ, మరీ అభినందనలు

ఆర్యా!

3వ, దోమావెంకటస్వామిగుప్త అవార్డు 1998 ఆహ్వానం అందినది. తమరు శ్రద్ధతీసుకొని, పంపినందులకు నా హృదయ పూర్వక ధన్యవాదాలు. శ్రీ ఆశావాదిని ఎన్నుకోవడము మీ బుద్ధికుశలతకు తార్కాణము. మీరు సాహిత్యసేవ చేస్తున్నందులకు నా అభినందనలు. వైశ్య ప్రభోధినీ పత్రికను శ్రద్ధతోనూ పట్టుదలతోనూ నిర్వహించుచుండుట శ్లాఘనీయము. ఈ రోజులలో ఒక మాసపత్రికను నడుపుట చిన్నవిషయంకాదు. చాల గొప్ప కృషితో కూడుకున్న విషయము. మీ సాహిత్యసేవకు మరీ, మరీ అభినందనలు.

ఎలిశెట్టి వెంకటసుబ్బయ్య
విశాఖపట్నం, 10/2/98

## 'అవార్డు' 1998, ప్రదాన - శ్రీ కన్యకాపురాణ కావ్యావిష్కరణ - గుప్తగారి చిత్రపటావిష్కరణసభావివరాలు - దృశ్యాలు

కడపపట్టణం ప్రధానకార్యస్థానంగా గత మూడు సంవత్సరాలుగా అర్థవంతమైన కార్యక్రమాలను నిర్వహిస్తున్న శ్రీ దోమా వెంకటస్వామిగుప్తసాహిత్యపీఠము వారు ఇచ్చే శ్రీ వెంకటస్వామిగుప్త అవార్డు 1998- ఈ యేడు - "తెలుగువెలుగు", "కళా తపస్వి", "అవధానికోకిల", "అవధానా చార్య", "అభినవసాహిత్యసోమయాజి" ఇత్యాది బిరుదవిరాజితులు అష్టావధాని శ్రీ ఆశావాదిప్రకాశరావుకు లభించింది.

12-2-1998వ తేదీ గురువారము సాయంత్రం 6 గంటలకు - కడపపట్టణము యర్రముక్కపల్లెలో గల సి.పి. బ్రౌను గంథా లయభవనములో ఈ 'అవార్డు' ప్రదాన సభ జరిగింది. సభకు పీఠం అధ్యక్షులూ, ప్రొద్దుటూరుపురప్రముఖులూ "సాహితీ బంధు" శ్రీ జూటూరురమణయ్య గారు అధ్యక్షత వహించారు.

బ్రౌనుగ్రంథాలయసంఘాధ్యక్షులు శ్రీ సి.కె. సంపత్‌కుమార్ గారు జ్యోతిని వెలి గించి సభను ప్రారంభించారు.

రాష్ట్రములోని అతిపెద్ద గ్రంథాలయాల్లో ఒకటీ, - శ్రీ పొట్టిశ్రీరాములు విశ్వవిద్యా లయంవారి అధ్యయనకేంద్రాలలో ఒకటీ అగు శ్రీ బ్రౌనుగ్రంథాలయభవనములో ఉంచుటకుగాను వ్రాయించిన శ్రీ దోమా వెంకటస్వామిగుప్త చిత్తరువును పీఠం అధ్యక్షులు శ్రీ జూటూరురమణయ్యగారు ఈసభలో ఆవిష్కరించారు.

ఈ పీఠము వ్యవస్థాపకులూ - ప్రధాన కార్యదర్శులూ 'సంఘోద్ధారక', 'వైశ్య భూషణ' శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారు గత మూడు సంవత్సరాలుగా జరుగుచున్నపీఠం కార్యక్రమాలనూ - భవిష్యత్ ప్రణాళికనూ, ఈ అవార్డు ప్రదానోత్సవాన్ని పురస్కరించు కొని వచ్చిన సందేశాలనూ సభలోచదివారు.

ఈ పీఠమువారు ఇప్పుడు ప్రచురిం చుటద్వారా ద్వితీయముద్రణకు నోచుకొన్న శ్రీ వెంకటస్వామిగుప్తగారి 'శ్రీ కన్యకా పురాణ' కావ్యాన్ని సరస్వతీపుత్రులు డాక్టర్ శ్రీ సి.వి. సుబ్బన్న శతావధానులుగారు ఆవిష్కరించి - సమీక్షిస్తూ, "ఈ కన్యకా పురాణము ఆర్యవైశ్యులకులదేవత శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరి కథకు సంబంధిం చినదే అయినా - ఈ కావ్యము సర్వులూ తప్పక చదువవలసిందనీ - తెలుసుకో వలసిన విషయాలు ఎన్నో ఉన్నాయనీ- ప్రౌఢరచన కలిగిన కావ్య"మనీ చెప్పారు.

శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవా లయాలు, ఆర్యవైశ్యధర్మసంస్థలసమాఖ్య, ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులూ; ప్రొద్దుటూరు పురపాలకసంఘాధ్యక్షులూ 'ప్రజాబంధు' 'దానశీల' శ్రీ కామిశెట్టిసుబ్బరావుగారు ఆశా వాదిని పట్టువస్త్రముతో సన్మానించి, పుష్పమాలాలంకృతుని చేసి అవార్డు మొత్తముగా రూ. 2,116/-లు ఇచ్చారు.

ఈ పీఠం వ్యవస్థాపకులూ, ప్రధానకార్య దర్శీ, శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారు 'అవార్డు'

పత్రమును చదివి ఆశావాదికి బహూక రించారు.

శ్రీ సి.పి. బ్రౌనుగ్రంథాలయసంఘ కార్య దర్శి శ్రీ జానమద్దిహనుమచ్ఛాస్త్రి గారు ఆశావాదిని సభకు పరిచయం చేశారు.

కడప ఆకాశవాణీకేంద్రనిర్దేశకులు శ్రీ ఆరవేటిశ్రీనివాసులుగారు, ఆశావాది చేసిన సాహిత్యకృషిని ప్రశంసించారు.

"శ్రీ వెంకటస్వామిగుప్తగారు కేవల అవధానులు కారనీ - మహావధానులనీ- అవధానములో చమత్కారాన్ని పోషించుట లోనూ, ఆశువుగా పద్యాలు చెప్పడము లోనూ గొప్ప ప్రతిభకలవారనీ - అరలక్ష పద్యాలు వారు వ్రాశారనీ - ఇది సామాన్య విషయం కాదనీ" ఆశావాది తన ప్రసం గములో చెప్పి, "ఇంతగొప్పవాని పేరుమీద ఏర్పాటైన 'అవార్డు' నాకులభించడం గొప్ప అదృష్టంగా భావిస్తున్నాననీ" అన్నారు.

శ్రీ కన్యకాపురాణకావ్యాన్ని ఆవిష్క రించిన శ్రీ సి.వి. సుబ్బన్న శతావధాని గారికి ఈ సభలో పండితసత్కారమూ - ఈ అవార్డు సభలో పాల్గొన్న ప్రముఖులకు జ్ఞాపికలసమర్పణా - గుప్తగారి చిత్రపటలేఖ కులు శ్రీ పద్మాకర్‌కు సన్మానమూ జరిగింది.

శ్రీ వెంకటస్వామిగుప్తగారి కుమారులు శ్రీ ఆంజనేయగుప్తగారు హైద్రాబాద్ నుండీ ఇదే పనిగా వచ్చి ఈ 'అవార్డు'సభలో పాల్గొనగా పీఠమువారు ఆంజనేయగుప్త గారికి కూడ సన్మానం చేశారు.

లైన్సు డిస్ట్రిక్టు జోనల్ ఛేర్మన్ శ్రీ జనార్దన పురాణిక వందనసమర్పణతో సభ ముగి సింది.

మద్రాసువాస్తవ్యులు శ్రీ డి. సాయినాథ గుప్త, శ్రీ డి. సురేంద్రనాథ్ గారలు గత రెండు సంవత్సరాలవలెనే ఈ ఏడుకూడ తలకొక రూ. 1500/-ల చొప్పున ఇచ్చి ఈ 'అవార్డు' ప్రదానానికి సహకరించారు.

(దృశ్యములు 10, 11, 12 పేజీలలో)

## ఆర్యవైశ్యులు మీకు ఋణపడిఉన్నారు

ప్రియమైన లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారికి,

అవార్డుసభ (శ్రీ దోమావెంకటస్వామి గుప్త అవార్డు 1998) ఉజ్జ్వలముగా జరిగినది.

శ్రీ కన్యకాపురాణము ముద్దుగా ముద్రిం పించితిరి. కాగితము, అచ్చు, బైండు అన్నీ చక్కగా నున్నవి-అభినందించు చున్నాను.

గ్రంథాంతమున మీరు రచించిన కథాసంగ్రహము రమ్యముగా నున్నది. మీ కృషి అనర్ఘము. ఆర్యవైశ్యులు మీకు ఋణపడి ఉన్నారు.

చి. ఆశావాదిప్రకాశరావు మీ యెడ మిక్కిలి కృతజ్ఞత కలిగియున్నాడు. కృతజ్ఞత అనునది సత్పురుషుల లక్షణముకదా?

శ్రీ గుప్తగారి 'మూకపంచశతి' ప్రక టింతుమని చెప్పితిరి. మంచిదే. దానిని మూలముతోగూడ ప్రకటించిన బాగుం డును. యోజింపుడు. సభలో చెప్పిన నా పద్యము

"అకలుషధర్మవర్తను ల -
హంకృతిదూరులు ఆర్యవైశ్య, లా
స్తికులు సుధీవిధేయులు వి
శిష్టసనాతనసంప్రదాయర
క్షకులు తథాభిజాత్యమును
గన్గొనయ్యెడు కన్యకాపురా
ణకథ పఠించినన్ తెనుగు
నన్ మశకాన్వయగుప్తవాక్కతిన్

\- శ్రీ సి.వి. సుబ్బన్న, శతావధాని
13-2-98



12-2-1998 నాటి ఈ శ్రీ కన్యకాపురాణ కావ్యావిష్కరణ సభలో ఆశీనులై ప్రసంగాలను ఆసక్తితో ఆలకిస్తున్న సభాసదులు



సరస్వతీపుత్రులు డాక్టర్ శ్రీ సి.వి. సుబ్బన్న శతావధానులు గారు ఈ శ్రీ కన్యకాపురాణ కావ్యాన్ని ఆవిష్కరించి, సభకు చూపిస్తున్నారు



ఈ శ్రీ కన్యకాపురాణ
కావ్యావిష్కరణ సభనూ -
శ్రీ వెంకటస్వామిగుప్త
'అవార్డు' 1998, ప్రధాన
సభనూ - తిలకించుటకై
హైద్రాబాద్ నుండీ
విచ్చేసిన శ్రీ గుప్తగారి
కుమారులు శ్రీ ఆంజ
నేయగుప్త గారిని సన్మా
నిస్తున్న ఈ పీఠం వ్యవ
స్థాపకులు ప్రధానకార్య
దర్శి శ్రీ పి. లక్ష్మీకాంతం
శ్రేష్ఠి గారు



12-2-1998 వ తేదీన
కడప బ్రౌనుగ్రంథాలయ
భవనములో గుప్తగారి
చిత్రపటావిష్కరణ



ఈ శ్రీ కన్యకాపురాణ కావ్యావిష్కరణ సభలో - శ్రీ వెంకటస్వామిగుప్త 'అవార్డు' 1998ని అష్టావధాని శ్రీ ఆశావాదికి ఇస్తున్న 'ప్రజాబంధు', 'దానశీల' శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు



ఈ శ్రీ కన్యకాపురాణ కావ్యావిష్కరణానంతరము కావ్యాన్ని ఆవిష్కరించిన శ్రీ సి.వి. సుబ్బన్నగారికి పండితసత్కారం చేస్తున్న ఈ పీఠం అధ్యక్షులు 'సాహితీబంధు' శ్రీ జూటూరురమణయ్య గారు

నమ్మకం నాకు కలిగింది. ఇందులో నేను చేసిన త్యాగం ఏమీలేదు. ఏది ఏమైనా నేను ఉరికంబాన్నెక్కబోతున్నాను. 'కుట్ర' కు నేనే కారకుడనని ఒప్పుకున్నా ఇంతకన్నా నాకేమీ పెద్దశిక్ష విధించరు గదా?

బల్వంత్‌సింగ్ భాయీని ఉరి తీశారు. అటు పిమ్మట గురుతరమైన మహత్తర కార్యభారాన్ని నేనే వహించాల్సి వచ్చింది. నేను నిలువెల్లా కంపించిపోయాను. కొంతకాలం ఏమీ తోచక కంగారు పడి పోయాను. తరువాత నూతనోత్సాహంతో కార్యరంగములో దుమికాను. కోర్టువారు నాకు మరణశిక్షను రద్దుచేసినా జైల్లో మాత్రం నిర్బంధించేవుంచారు. ప్రధమ ప్రపంచయుద్ధం ముగిసే వరకూ నన్ను జైల్లోనే నిర్బంధించ వలసిందిగా ప్రభుత్వ ఆజ్ఞ రావడంతో నన్ను లాహోర్ జైలు నుండి కన్ననూరు సెంట్రల్ జైలుకు మార్చారు. అక్కడ జైళ్ళ దుస్థితిని మార్చడానికి నేను చేసిన అలజడి కారణంగా నన్ను కోయంబత్తూరు సెంట్రల్ జైలుకు బదిలీ చేశారు. అక్కడ జైలర్ గురునాధయ్య నాతో ఘర్షణకు తలపడి చివరకు క్షమించ మని వేడుకున్నాడు. ఆతని నైతిక పిరికి తనానికి నాకు నవ్వొచ్చింది. ఇలాంటి అనుభవాలు నాకు రెండు విషయాల్ని భోధించాయి.

(1) ఏ వ్యక్తి అయినాసరే తాను నైతికంగా బలంగా వుంటూ తన వ్యతిరేకిని నైతికంగా ఓడిల్ఛవచ్చు. వ్యతిరేకి భౌతికంగా ఎంత బలవంతుడైనా సరే.

(2) ఒక మహత్తర ఆశయంకోసం చావు కైనా సిద్ధపడ్డవాడు అలా సిద్ధపడనివాడి కంటే శతవిధాల బలవంతుడు.

## సంఘ సంస్కర్త

1919లో నేను జైలునుండి విడుదల య్యాను. బయటికి వచ్చేసరికి అనేక కొత్త సమస్యలు ముప్పిరిగొన్నాయి. బాల్య వివాహాలు. నిర్బంద వైధవ్యం. అనుషం గికంగా వస్తున్న వేశ్యాలంపటత్వం. అస్పృ శ్యతలాంటి సమాజరుగ్మతలు చైతన్యంగల ఆధునిక మనిషిని ఇట్టే పల్టీ కొట్టించగలవు. దాదాపు ఒక డజను విధవా వివాహాలన్నా నా చేతి మీదగా జరిగాయి.

గాంధీగారు ఆధునిక సమాజానికి పునాదులు వేశారు. యువకులు ఉవ్వెత్తున కార్యాచరణకు దూకారు. వారితో కలిసి పని చేసే అదృష్టము, సంఘ సంస్కరణ కార్యక్రమంలో వాటికి నాయకత్వం వహించే అదృష్టమూ నాకు కలిగాయి. ఈ సమ యంలో మేము అభివృద్ధి నిరోధకులైన మాపెద్దవాళ్ళను ఎదిరించాము. వాళ్ళు మడిగట్టుకు కూర్చున్న పవిత్ర "ఆచార సంప్రదాయా"లకు తూట్లుపొడిచాం. ఆ విధంగా మేము కొనివచ్చింది అహింసా పూర్వకమైనసామాజిక విప్లవమేగాదు. తుదకు విదేశీ పాలననే దేశంనుండి తరుమగొట్టాం. మన దేశానికి సోషలిష్టు రాజ్యాంగా న్నొకదాన్ని రూపొందిద్దామని మేము తీవ్రప్రయత్నాలు చేశాం.

ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో నేనంటే ప్రభుత్వానికి రాజకీయంగా అనుమానం వుండేది. నావలె స్వాతంత్ర్య సాధనకు కృషిచేస్తున్నవారు వివిధ రాజకీయ పార్టీలకు చెందినవాళ్ళు అనేకమంది వున్నారు. 1940 సంవత్సరానికి ఈ బాపతు

వాళ్ళం ఒకవందమంది చేరాము. మేమంతా మద్రాసు రాష్ట్రానికి చెందిన వాళ్ళం మాలో కొందరు ఇప్పుడు మంత్రులయ్యారు. ముఖ్యమంత్రులు, పార్లమెంటు, శాసన సభ్యులు, మరికొంతమంది గవర్నర్లుగా కూడా గొప్ప పదవుల్లోకి వచ్చారు. ప్రభుత్వం మమ్ములను సవ్యంగా చూడక పోవడంతో మాలో చాలామందిమి జైల్లోనే నిరాహార దీక్షవహించాము దీక్షప్రారంభమైన 21 రోజులతర్వాత ప్రభుత్వం సుప్రీంకోర్టు జడ్జీలలో ఒకరైన శ్రీ మచ్చు జగన్నాధ దాసును మధ్యవర్తిగా నియమించింది. సత్యాగ్రహుల కోర్కెలు అంగీకరించ బడ్డాయి. అంతటితో సమ్మె విరమించాము"

ఈ విధమైన శ్రీ చెంచయ్యగారి స్వానుభవాలను బట్టి చూడగా ఆయన ఎంతటి కార్యసాధకుడో, త్యాగశీలియో, దేశాభిమానో మనకు బాగా అర్థమవుతున్నది. భారత మాత గర్వించదగ్గపుత్రుల్లో ఒకరైన దర్శి చెంచయ్యగుప్తగారు 1965వ సంవత్సరములో మరణించారు.

## చరిత్ర పుటల్లో చెంచయ్యగారు

History of Modern Andhra
by
P.R. RAO,
Page No.49

Darsi Chanchaiah was the only Andhra who joined the gadar party, but he did not stay in it for long.

"ఆంధ్రప్రదేశ్ దర్శిని"

Page No.555

డాక్టర్ షల్‌వుడ్ విడ్జి వ్రాసిన "రష్యా సవాలు - ఈనాటిరష్యా గ్రంధాలు తన భావాలను ప్రేరేపించి తనను కమ్యూనిస్టుగా మార్చినవని దర్శి చెంచయ్య చెప్పి వున్నారు.

ఫ్రెడరిక్ ఎంగెల్స్ వ్రాసిన "యాంటీ డ్యూరింగ్"చే చెంచయ్యగారు ప్రభావితులైనారని చంద్రరాజేశ్వరరావుగారు వ్రాశారు.

(వైశ్యవైజయంతిక నుండి)

## షిర్డీ క్షేత్రములో 'సాయిభక్తనివాస్'

అఖిలభారతములోగల అతిప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో ఒకటగు మహారాష్ట్రలోని షిర్డీక్షేత్రములో, తిరుమలలోని శ్రీ దక్షిణఇండియాఆర్యవైశ్య శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీధర్మపరిపాలనాసంస్థవారు తమ యాజమాన్యమున ఏర్పాటు చేసిన 'అఖిల భారతషిర్డీక్షేత్ర సాయిభక్తనివాస్‌ట్రస్టు' తరపున - షిర్డీ సాయిబాబాను సందర్శించుటకు వచ్చే భక్తులకు నివాసవసతులు కలుగజేయాలన్న తలంపుతో ఆధునిక సౌకర్యములు గల వందగదులతో చక్కని వసతిగృహమును నిర్మిస్తున్నారు.షిర్డీలోని పుష్పాంజలీహోటల్ వెనుక, చక్కని భోజనఫలహారశాలతోకూడ నిర్మించదలచుకొన్న ఈ వసతిగృహనిర్మాణానికి రెండుకోట్ల రూపాయలు అవసరమౌతుందని అంచనా వేసిన ఈ ట్రస్టువారు ఇదే సంచిక 15వ పేజీలో సూచించినవిధముగా విరాళములను ప్రకటించారు.

విరాళాలను "అఖిలభారత్ షిర్డీక్షేత్ర సాయిభక్తనివాస్ ట్రస్టు" పేరున 'చెన్నైలో చెల్లునట్లుగా చెక్కులరూపములోగానీ, డిమాండు డ్రాఫ్టుల రూపములోగానీ -దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీధర్మపరిపాలనాసంస్థ, 73-A, శాంతోమ్ హైరోడ్డు, చెన్నై - 600 028కి పంపాలి.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1998 మార్చి 21 నుండీ 1998 ఏప్రిల్ నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 22 | 29 | 5 | 12 | 19 |
| సోమవారము | | 23 | 30 | 6 | 13 | 20 |
| మంగళవారము | | 24 | 31 | 7 | 14 | |
| బుధవారము | | 25 | ఏప్రిల్ 1 | 8 | 15 | |
| గురువారము | | 26 | 2 | 9 | 16 | |
| శుక్రవారము | | 27 | 3 | 10 | 17 | |
| శనివారము | 21 | 28 | 4 | 11 | 18 | |

మార్చి 29 :- ఉగాది - బహుధాన్యనామసంవత్సరారంభం. దుకాణాలు -సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతోకూడిన సెలవుదినము.

మార్చి 31 :- రేవతీకార్తె రాక సా. 6-35

31వ తేదీలోగా చేర్చాలి.

మార్చి 31 :- 1998 ఫిబ్రవరినెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు చివరితారీఖు.

మార్చి 31 :- ఆదాయపుపన్నుచట్టములోని 115 K సెక్షనుమేరకు లబ్ధిపొందదలచుకొన్న చిల్లరవర్తకులు (రీటైల్‌డీలర్) తమ వ్యాపారానికి సంబంధించిన స్టేటుమెంటు ఫారము నెం.4A లేక 4B ని తగిన ఆధారాలతో అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు కడపటి తేది.

మార్చి 31 :- ఇంతవరకూ పర్మనెంట్ నెంబరు అలాటుచేయబడనివారూ, గడచిన 1997-98 ఆర్థిక సంవత్సరములో 'నిల్' రేటుతో విధించదగు ఆదాయపుపన్ను మొత్తమునకు మించని ఆదాయముకలవారూ, 1997-98 ఆర్థికసంవత్సరములో జరిగిన మొత్తము అమ్మకములూ, టర్నోవరూ, గ్రాసురిసిప్టు రూ. 50,000/-లకు మించవచ్చునను పన్ను చెల్లించుదారులూ ఆదాయపుపన్నుచట్టము క్రింద పొందవలసిన పర్మనెంట్అకౌంటు నెంబరును పొందుటకు దరఖాస్తు చేయుటకు చివరితారీఖు.

ఏప్రిల్ 5 :- శ్రీరామనవమి.

ఏప్రిల్ 8 :- బక్రీదు

ఏప్రిల్ 9 :- మహావీరజయంతి

ఏప్రిల్ 13 :- అశ్వనీకార్తె రాక తె. 5-43.

ఏప్రిల్ 14 :- సౌరవత్సరాది (తమిళుల ఉగాది)

ఏప్రిల్ 15 :- చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించువర్తకులు చెక్కుతోబాటు A-2రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరురోజు.

ఏప్రిల్ 17 :- గుడ్‌ఫ్రైడే (మంచిశుక్రవారము)

ఏప్రిల్ 20 :- A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరితారీఖు.

**22, 29, 5, 12, 19 ఆదివారాలు**

---

*- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం : వ్యాసప్రణీత స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి (సంపాదకులు)

(గత సంచిక తరువాయి)

ఆ రాజు నన్ను వివాహం చేసుకోవాలి అని అనుకుంటున్నాడు కదా? ఆ కోర్కె తీర్చుకొనుటకు దండెత్తి రావాలను కున్నాడు కదా! ఆత్మార్పణ చేసి, అతని వల్ల మన లక్ష్యమైన శాంతి, ధర్మాలకు భంగము కలుగకుండా చూస్తాను. 'రక్తరహిత శాంతి సత్యాగ్రహము' అను సాధనాన్ని నేను భువిలో స్థాపిస్తాను. అంధకార బంధురంగా ఉన్న యీ ప్రపంచంలో 'అహింస' అనే జ్యోతిని వెలిగిస్తాను. ఆత్మార్పణ ద్వారా వర్ణాశ్రమాచార ధర్మ సంరక్షణను చేస్తాను.'

వాసవి పలికిన ఈ మాటలు కుసుమ గుప్తునిలోని ఆవేదనను మిక్కుటం చేసెను. తన బిడ్డ నోటి న్నుండీ ఇటువంటి మాటలు వస్తాయని ఆయన ఊహించలేదు.

"తల్లీ! ఏమి ఈ నీ నిర్ణయము. ఇంత కఠినమైన మాటలను కన్నతండ్రి విని భరించగలడా? ప్రపంచములో ఏ తండ్రి అయినా, తల్లి అయినా, తన బిడ్డను వడిబియ్యంతో అత్త వారింటికి సాగు నంపుతాడే కానీ, అగ్ని గుండములో పడమని పంపునా? ఈ మాటలు వింటే నీ తల్లి ఎంతగా దుఃఖిస్తుందో ఆలోచించ లేదా? ఈ శరీరములో ప్రాణాలుండగా మేము ఇందుకు సమ్మతించము. మరీ తప్పని పరిస్థితి వస్తే కత్తి పట్టి, కదన రంగములో వీర విక్రమముతో సంచరించి, ఆ దుష్ట రాజన్యుని శిరసును ఉత్తరిస్తాను. అందుకు మనమంతా ప్రాణప్రదంగా భావిస్తున్న ఈ అహింసా సిద్ధాంతానికి కూడ నీళ్ళువదలుతాను. విజయమో! వీర స్వర్గమో! మేమే తేల్చుకుంటాము. తొందరపడి నీవు ఏ నిర్ణయమూ తీసుకోకు. నాకుమాటఇమ్ము" అని పలికెను.

తండ్రి మాటలు విని వాసవి వింతగా నవ్వింది. "తండ్రీ! మీరు ప్రాజ్ఞులు కదా! బాలిశుల వలె ఇట్లు పలుక వచ్చునా? ఎవరి వ్రాతలకు కర్తలు వారే గానీ, వేరెవరూ కారు కదా! మమతలూ, అనురాగాలూ దేహమునకు సంబంధించినవి. ఆత్మకు సంబంధించినవి కావు. దేహము నీటి బుగ్గవలె అశాశ్వతమైనది. రెండు కఱ్ఱలు ప్రవాహ వేగములో కొట్టుకొని పోతూ మధ్య మధ్యలో కలిసికొని కొంతదూరము ప్రయాణం చేసి, అనంతరము విడిపోవు నట్లుగా, మానవులలో గల తండ్రి, తల్లి, బిడ్డ అను భావనలు కూడ కలిసికొంటూ విడిపోతూ ఉంటాయి. ఆత్మ మాత్రమే శాశ్వతమైంది. ఆత్మ సర్వ జీవులందునూ ఉంటుంది. అందుకే విజ్ఞులు ఈ ఐహిక వాంఛలకు ప్రాధాన్యత ఇవ్వరు. తామరాకు మీద ఉండే నీటిబొట్టు మాదిరిగా ఈ ఇహపరమైన, సుఖ దుఃఖాల, మమతాను

బంధాల విషయములో అంటీ అంటక ఉంటారు అందువలన ప్రాజ్ఞులైన మీరు ఈ విధంగా చింతించకూడదు ఆందోళన చెంద కూడదు. ఆ కన్యకాపరమేశ్వరీదేవి ఇచ్ఛ ఎట్లున్నదో అట్లే జరుగును. చింతను వీడి కావలసిన కార్యమును గూర్చి, ధృఢ చిత్తముతో ఆలోచించుడు" అని చెప్పెను.

అయినా కుసుమగుప్తుని దుఃఖము ఆగలేదు. కన్నీరొలికే కనులతో బిడ్డ ముఖమును చూశాడు. అది గమనించిన వాసవి "తండ్రీ! నన్ను కేవలము బిడ్డగానే చూస్తున్నావు. నేనే పరాశక్తిని అను విషయాన్ని మరచినావు. నా యీ అవతార ధ్యేయ సాధనకు నీవు కూడ ఆలంబనమే. నీకు దివ్యదృష్టిని ఇస్తున్నాను. గతము సర్వమూ అవగత మౌతుంది. తిలకించుము". అని వాసవి పలికెను.

తాను కుబేరుడననీ, తన కోర్కె మేరకే పరాశక్తి జన్మించిందనీ మొదలగు అన్ని దృశ్యాలూ ఆయనకు కనిపించెను. కుసుమ గుప్తునికి స్వస్వరూప విజ్ఞానము కలిగెను.

"ఇక చాలు. ధన్యోస్మి. ధన్యోస్మి తల్లీ! సర్వమూ గతము అవగతమయ్యెను. నీ సంకల్పము యెఱుక పడెను. ఇక, నీ యిష్టము. నీ అభీష్టము ప్రకారమే జరుపుము. మేము నిమిత్త మాత్రులము. మేమంతా నీ ఆధీనులము. తల్లీ! ఈ నీ నిర్ణయము ఇప్పుడే నీ తల్లికి చెప్పకు. ఆ ముదుసలి గుండె ఇంత కఠోర నిర్ణయాన్ని విని భరించలేదు". అని కుసుమ గుప్తుడు పలికెను.

ఇది స్కాంధ పురాణమందు – సనత్సు జాతీయ సంహితగల ఉత్తర ఖండము – విష్ణువర్ధనుడు కుసుమ శ్రేష్ఠికి గడువును ఇచ్చుట – శ్రీ వాసవీ – కుసుమగుప్తుల సంవాదము – తానే ఆదిశక్తి అని వాసవి తెలుపుట – తన ఆత్మార్పణే పరిష్కార మార్గమనుట – 15వ అధ్యాయము)

## పదహారవ అధ్యాయము

సాలంకాయనుడు ఇటు చెప్పు చున్నాడు.

అనంతరము మరుదినము సమాలోచన జరిగెను. ఆ సమాలోచనలో పద్దెనిమిది పట్టణాల ప్రభువులు – మంత్రులు – హితులు పాల్గొనిరి. విష్ణువర్ధన రాజు తనకు ఇచ్చిన గడువు విషయాన్ని ఆ సమాలోచనలో కుసుమ గుప్తుడు చెప్పెను.

ఆ మాటలు విని విరూపాక్షుడు, ఆయన నాయకత్వములోని బాల నగరులు ప్రళయకాలరుద్రులైరి. ఇది విష్ణువర్ధనుని దురహంకారానికి తార్కాణము. మన యెడల ఆయనకు గల చులకన భావానికి చిహ్నము. ధర్మ విరుద్ధమూ, నిందితమూ అయిన ఆరాజు కోర్కెను మన్నించరాదు. ఆతని పొగరణచవలెను. అని పలికి కుసుమగుప్తుని వైపు చూస్తూ "ప్రభూ! ఇక ఆలస్యము చేయ తగదు. అనుజ్ఞ ఇవ్వండి. ఇప్పుడే బాలనగరులతో వెళ్ళి ఆ రాజాధముని శిరస్సును ఖండించి, తెచ్చి, మీ పాదాలకు వీరపూజ చేస్తాను. "అని అతి భీషణముగా పలికెను. బాలనగరులు ఆయన మాటలనే సమర్థించిరి.

విరూపాక్షుని తీవ్రత, కుసుమగుప్తునికి కోపమును కలిగించెను. "విరూపాక్షా! ఈ సమాలోచనలో వయస్సులోనూ, అనుభ

వములోను, ఆలోచించడములోను నీ కన్నా పెద్ద వారున్నారు. ఈ విధంగా దుడుకుగా మాట్లాడడం నీకు తగదు" అని మంద లించెను

"ఆర్యులారా! ఈ సమాలోచనలో పాల్గొన్న మీరంతా విషయాన్ని విన్నారు. విష్ణువర్ధనుడు తన ఆలోచనను మాను కోలేదు. కడకు బలవంతంగా కన్యకను తీసుక పోవుటకు కూడ ప్రయత్నిస్తున్నాడు. ఆలోచించి నాకు కర్తవ్యాన్ని ఎఱుక చేయుడు". అని కుసుమగుప్తుడు అడిగెను.

మనువు మాత్రమే వర్ణాంతర వివాహాలను అంగీకరించెను. పరాశరుడు అట్టి విలోమ వివాహాలను అంగీకరించ లేదు. ఇప్పుడు ఉన్నది కలియుగము. ఈ కలియుగమునకు పరాశరుని సూత్రములే ప్రమాణములు, ఆచరణీయములు. అందువలన విష్ణువర్ధనునికి 'కన్యక' ను ఇవ్వకూడదు అను మనందరిదైన మునుపటి నిర్ణయము నకు మార్పులేదు. అవసరమైన మనమంతా ధనమునూ, ప్రాణములనూ వదలి ఆ దుష్ట భూపతి చర్యను ఎదుర్కొన వలసిందే. అని ఆ సమాలోచనలో పాల్గొన్న వారిలో పలువురు చెప్పిరి.

అంత, కౌండిన్య గోత్రములో జన్మించిన వాడు, పాలకుండ పురమునకు అధిపతియైన వాడు, సూసాళ్ళ వంశమున పుట్టిన వాడు అయిన 'వీరశ్రేష్ఠి' లేచి, "మహారాజా! కుసుమగుప్త ప్రభూ! సామము, భేదము, ఉపాయము, దండము అను నాలుగింటిలో దండము చివరిది. అందువలన, మన భాస్కరా చార్యులను దూతగా పంపి, విష్ణువర్ధనుని నిర్ణయాన్ని మార్చుటకు మరియొక తూరి ప్రయత్నించండి" అనెను.

భారద్వాజఋషి గోత్రముగా గలిగి, బలిశిష్ఠ వంశమున పుట్టిన జగన్నాథ పురాధిపతి భద్రుడు, మార్కెండేయస గోత్రజుడు, మరువంశ చంద్రుడు, ప్రోలాపురి పరిపాలకుడు పుంసిఫాఖ్యుడు మొదలగు కొందరు 'వీరశ్రేష్ఠి' చెప్పినది కూడ ఆలోచించవలసిన విషయమే అనిరి.

విరూపాక్షుడు, బాలనగరులు మాత్రము ఆ సూచనకు అంగీకరించలేదు.

అనంతరము బాగుగా ఆలోచించిన కుసుమశ్రేష్ఠి వీరశ్రేష్ఠి వచనములనే అంగీకరించెను. తన కులగురువగు భాస్కరాచార్యుని విష్ణువర్ధనుని వద్దకు రాయబారము పంపుటకు నిశ్చయించెను. కుసుమగుప్తుని ఆదేశమును భాస్కరా చార్యుడు పాలించెను. బయలు దేరుటకు ఉద్యుక్తుడగుచున్న ఆచార్యుల వారితో విరూపాక్షుడు ఇట్లు పలికెను. "గురువర్యా! విష్ణువర్ధనునితో మాట్లాడునపుడు ఈ బాలనగరుల శౌర్యప్రతాపాలను మరచి పోవద్దు. మన మహారాజు అనుసరిస్తున్న అహింసా పద్ధతి వల్ల పనిలేక పడియున్న మా కత్తులకు పని కలగ జేయండి. రాజా! విష్ణువర్ధన నరేంద్రా! నీవు నా మాటను వినకున్న మా విరూపాక్షుని ఖడ్గము నీ కుత్తుకను ఉత్తరించక శాంతించదు" అని గట్టిగా చెప్పిరండి అనెను.

ఇది స్కాంధ పురాణమందు - సనత్సు జాతీయ సంహిత గల ఉత్తర ఖండము - పదునెన్మిది పట్టణాల అధిపతుల సమాలోచన - భాస్కరాచార్యులను విష్ణు వర్ధనుని వద్దకు పంపుట - 11వ అశ్వాశము.

(వేగముగా పయనించగల గుఱ్ఱములు కట్టిన రథమునెక్కి అవసరమైన పరి వారముతో భాస్కరాచార్యుడు 'పద్మశయన

పురము'నకు వెళ్ళెను. విష్ణువర్ధన రాజునకు తాను వచ్చిన విషయాన్ని చెప్పి పంపెను.)

ఆచార్యుని రాకను వినిన రాజు, తన కోర్కెను కుసుమగుప్తుడు అంగీకరించెను. ఆమాట చెప్పుటకే ఆచార్యులు వచ్చిరని భావించి, సంతోషముతో ఉప్పొంగిపోయి, గౌరవముగా తోడ్కొని రమ్మని భటులను పంపగా, ఆచార్యులు రాజు సన్నిధికి వచ్చెను. కుశల ప్రశ్నలు జరిగెను.

ప్రముదిత హృదయుడైన విష్ణవర్ధనుడు ఆచార్యా! కుసుమగుప్తుడు మా కోర్కెను అంగీకరించినాడు కదా! మహూర్త నిర్ణయమును చేసి పంపినాడు కదా! నామనస్సును ఆనంద డోలికలలో ఊగించు ఆ సమయమును త్వరగా ఎఱింగించండి. మాకు తెలుసు. కుసుమగుప్తుడు చాలా తెలివైనవాడు. బలవంతులతో విరోధము పెట్టుకోడు. మా వంటి ఉత్తమ క్షత్రియుల తోడి వియ్యము తనకు మరింత యశస్సును తెస్తుందని కూడ కుసుమగుప్తుడు ఆలోచించే ఉంటాడు." అని భాస్కరాచార్యులతో పలికెను.

భాస్కరాచార్యులు ఆ రాజు మాటలు విని, హృదయములో నవ్వుకొని, ఆరాజు యొక్క తెలివి హీనతకు మనస్సులో బాధపడి ఇట్లు జవాబు చెప్పెను. "రాజా! మీ ఊహ తప్పు. కుసుమగుప్తుడు ధర్మ స్వరూపుడు. ఆయనకు తెలియని ధర్మ సూక్ష్మములులేవు. అతిగా ఆశలకు పోడు. ప్రలోభాలకు లొంగిపోడు. స్థిర చిత్తుడు. సుఖ దు:ఖముల విషయములో ఆయన తామరాకుమీదినీటి బిందువు వలె ఉంటాడు. కలియుగమునకు అనుసర ణీయమైన పరాశరుని స్మృతి వాక్యములనే అంగీకరిస్తాడు. ఆయన కుమార్తె వాసవి కారణజన్మురాలు. అంధకారబంధురమైన ఈ ప్రపంచములో 'అహింస' అనే దీపాన్ని వెలిగించేందుకు జన్మించిన తల్లి అని ఆయన విశ్వాసము. ఆయన విశ్వాసమే కాదు - మా అందరి నమ్మకము కూడా అదే.

భాస్కరుని ప్రతివాక్యాలను విన్న విష్ణు వర్ధనునికి ఒక్కసారిగా అఘాధములో పడిపోయినట్లైంది. ముఖము వాడిపోవుటకు ఆరంభించించి.

భాస్కరాచార్యుడు తన మాటలను తిరిగి కొనసాగిస్తూ "రాజా! మీరు పాండవ వంశీయులని ప్రతీతి. అట్టి పవిత్రమైన వంశమున పుట్టిన మీకు ఈ విధమగు కోరిక కలగడం భావ్యము కాదు. పరనారీ వ్యామోహము ఎంతటి గొప్పబలవంతుని కైనా మరణాన్ని కలిగిస్తుంది. రాజా! మీకు తెలియదా! 'రావణాసురుడు గొప్ప వివేకి మహాబల, పరాక్రమ సంపన్నుడు. ధర్మ స్వరూపమును చక్కగా ఎఱిగినవాడు. పార్వతీపతియైన పరమశివునికి ప్రాణ ప్రధమైన భక్తుడు. అగ్రగణ్యుడు. బ్రహ్మవంశసంజాతుడు. అంతటి వాడుగా ఉన్న ఆ రావణుడు, పరనారీ వ్యామోహం చేతనే కదా! నాశనమైంది. ఇటువంటి వారు మరి కొందరిని గురించి కూడా మీకు తెలియనిది కాదు. తెలిసి కూడ మీరు ఈ విధంగా 'కన్యక'ను కోరడం ధర్మమునకు విరుద్ధము. ధర్మ విరుద్ధముగ వర్ణాంతర వివాహాన్ని చేయుటకు కుసుమగుప్తుడు అంగీకరించడు. ఈ మాటే మీకు చెప్పుటకు వచ్చాను. బాగా ఆలోచించండి. త్వరపడి తీవ్ర నిర్ణయమును తీసుకోకండి. మన ఈ రెండు రాజ్యాల మధ్య ఉన్న మంచి సంబంధానికి, స్నేహ, సౌభాతృత్వాని ముఖ్యముగా శాంతికీ భంగము కలిగించ కండి." - అని వివరించాడు.

(ఇంకా వుంది)

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్యనిత్యాన్నదాన సత్రభవన ప్రారంభోత్సవం



కడపజిల్లాలోని ప్రసిద్ధపుణ్యక్షేత్రాలలో ఒకటైనకందిమల్లాయపల్లె (బ్రహ్మంగారి మఠం) లోని పై అన్న సత్రంవారు కోటి రూపాయలకు పైబడి వ్యయముతో మనోహరంగా నిర్మించిన శ్రీ వాసవీవీర బ్రహ్మేంద్రఆర్యవైశ్యనిత్యాన్నసత్రభవనాన్ని శ్రీవాసవీకన్యకాపరమేశ్వరీదేవ్యాలయాలు, ఆర్యవైశ్యధర్మసంస్థలసమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ అధ్యక్షులూ, ప్రొద్దుటూరుపుర పాలకసంఘాధ్యక్షులూ, 'ప్రజాబంధు' 'దానశీల' శ్రీకామిశెట్టిసుబ్బరావుగారు 1-2-1998వ తేదీ ఉదయం 11 గంటలకు ప్రారంభించారు. చాగలమర్రి వైశ్యప్రముఖులు' శ్రీ మదళ్ళపల్లెవెంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు, ఈ భవనములోని రెండవ ద్వారాన్నీ, శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్యధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ కోశాధికారీ, శ్రీ దోమావెంకటస్వామిగుప్త సాహిత్యపీఠం అధ్యక్షులూ, ప్రొద్దుటూరుపురప్రముఖులూ 'సాహితీబంధు', శ్రీ జూటూరు రమణయ్యగారు కార్యాలయగదినీ, కడపజిల్లా దూదివర్తకుల సంఘాధ్యక్షులు 'వాణిజ్యరత్న', శ్రీ వల్లంకొండుసత్యనారాయణగారు గదుల సముదాయాన్నీ, ఈ అన్నసత్రం గౌరవాధ్యక్షుల్లో ఒకరూ, ప్రొద్దుటూరు పురప్రముఖులూ అగు శ్రీకోటిగంగయ్యగారు త్రాగునీటి ట్యాంకునూ ప్రారంబించారు.

ఆనాటి సాయంత్రం 4గంటలకు సదరు భవనప్రాంగణములో జరిగిన ప్రారంభోత్సవ సభకు శ్రీ కామిశెట్టిసుబ్బరావు గారు అధ్యక్షత వహించగా మాజీశాసన సభ్యులూ, ప్రొద్దుటూరు ఆర్యవైశ్య సభాధ్యక్షులూ శ్రీ కొప్పరపుసుబ్బరావుగారు ఈసభలో ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీ జూటూరురమణయ్యగారు ప్రారంభించిన ఈ సభలో కడపజిల్లా దూదివర్తకుల సంఘాధ్యక్షులు 'వాణిజ్యరత్న' శ్రీ వల్లంకొండుసత్యనారాయణ ప్రభృతులు ప్రసంగించారు. ఈ సంఘం కార్యదర్శి శ్రీ జూటూరుశరభయ్యగారు నివేదికను సమర్పించారు. ఈ అన్నసత్ర సంఘం ఉపాధ్యక్షులు శ్రీ పిన్నిసుబ్రమణ్యంగారి వందనసమర్పణతో ముగిసిన ఈ సభలో దాతలకు సన్మానం జరిగింది.

# శ్రీమేడానరసింహులు, శ్రీమతి మేడాశకుంతలమ్మ గార్లకు రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య సన్మానమూ, 'సేవారత్న' బిరుదప్రదానము



హైద్రాబాద్ పట్టణప్రముఖులూ ప్రముఖభవననిర్మాతలూ, 'నిర్మాణరత్న' శ్రీ మేడానరసింహులుగారి షష్టిపూర్త్యుత్సవం 9-2-1998న జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని హైద్రాబాద్‌నగరముకార్యస్థానంగాగల రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్యవారు శ్రీ మేడానర సింహులుగారిని 'సేవారత్న' అను బిరుదును ఇచ్చి సత్కరించారు. తదుపరి శ్రీ నరసింహ్ములుగారినీ, వీరి సతీమణి శ్రీమతి శకుంతలమ్మగారిని పై సమాఖ్యవారు ఘనంగా సన్మానించారు.

హైద్రాబాద్‌నగరము జయాగార్డన్స్‌లో జరిగిన ఈ బిరుదప్రదానసభకు సదరు సమాఖ్య అధ్యక్షులు శ్రీ గోపానరసింహులుగారు అధ్యక్షత వహించారు. ఈ సమాఖ్య వ్యవస్థాపకులూ స్వాతంత్ర్యసమరయోధులూ శ్రీ కె.సి. గుప్త, శ్రీ గిరీష్‌సంఘీ, శ్రీ జయంసుబ్రమణ్యం, శ్రీ సుంకుబలరాం, సమాఖ్యప్రధానకార్యదర్శి శ్రీ జి. వెంకటరమణయ్య సమాఖ్య కార్యదర్శి శ్రీ కె.కె.రావు గారలు పాల్గొన్నారు. రాష్ట్రం నలుమూలల నుండీ వచ్చిన పలు సేవాసంస్థల నిర్వాహకులూ, పారిశ్రామికవేత్తలూ ఈ శ్రీ నరసింహ్ములుగారినీ, ఆయన సతీమణి శ్రీమతి శకుంతలమ్మ గారినీ ఘనంగా సత్కరించారు.

## శ్రీ యం.వి. చలపతిగారి నూతన గృహప్రవేశం

బెంగుళూరుపట్టణవైశ్యప్రముఖులు శ్రీ యం.వి. చలపతిగారు తాము బెంగుళూరు పట్టణము హనుమంత్‌నగర్ 7వ మెయిన్, 4వ క్రాస్‌లో నూతనముగా నిర్మించుకొన్న గృహము 'బాలాజీ నిలయము'లో 9.2.1998వ తేదీ సోమవారం ఉదయం 5గంటకు ప్రవేశించారు.

*(గమనిక:- ఈ శీర్షికన ప్రకటన కావాలనుకొనే వారు డి.డి.లేక యం.ఒ ద్వారా 116/-లు పంపుచూ అవసరమైన విషయాన్ని వ్రాయాలి.)*

# చిట్టిప్రోలు ఆంజనేయులుకు 'సేవారత్న' బిరుదప్రదానము



హైద్రాబాద్‌లోని 'మనోరంజని' సాంస్కృతికసంస్థవారు ఈ మధ్య - శ్రీ చిట్టిప్రోలు ఆంజనేయులుగారికి "సేవారత్న" అను బిరుదును ఇచ్చి ఘనంగా సత్కరించారు. సంక్రాంతి పర్వదినవేడుకలలో భాగంగా హైద్రాబాద్‌లో జరిగిన ఈ బిరుదప్రదానసభలో ప్రముఖరంగస్థలనటులు శ్రీ జె.వి. సోమయాజులు, చలనచిత్రనటులు శ్రీ రంగనాథ్, దైవజ్ఞశర్మ, శాసనసభమాజీసభాపతులు శ్రీ డి. శ్రీపాదరావు ప్రభృతులు పాల్గొన్నారు.

శ్రీ ఆంజనేయులుగారు గుంటూరుజిల్లా దాచేపల్లె ప్రముఖులు. పిడుగురాళ్ళ తాలూకా ఆర్యవైశ్యసంఘంకార్యదర్శిగానూ, గుంటూరుజిల్లా ఆర్యవైశ్యసంఘం ఉపాధ్యక్షులుగాను ఉండి స్వసంఘానికి తనసేవలందించుటేగాక లైన్సుక్లబ్బువంటి పలుసేవా సంస్థల్లో చక్కనిపాత్రను నిర్వహించి సార్వజనిక సేవనుకూడ మిక్కిలిగా చేస్తున్నారు.

## గుప్తగారి పద్యకావ్యాలను పాఠ్యాంశాలుగా పెట్టించండి

12.2.1998న కడపలోని సి.పి. బ్రౌను గ్రంథాలయములో జరిగిన దోమావెంకటస్వామిగారి అవార్డు ప్రధానాన్ని తిలకించాను. అచ్చటి వక్తల మనోభావాలను గ్రహించాను. గుప్తగారి సాహిత్యకృషిని వింటున్నంతసేపూ పులకించి పోయాను. అవి నామనస్సులో చెరగనిముద్ర వేసుకొన్నాయి. గుప్తగారి పద్యకావ్యాలను 8 నుండీ 10వ తరగతి విద్యార్థులకు పాఠ్యాంశాలుగా ప్రభుత్వము ఎన్నుకొనుటకు శ్రీ రోశయ్యగారి ద్వారా కృషిచేయండి. అర్థములేనిగేయాలు, స్వీయకవితలు 9వ తరగతి పాఠ్యపుస్తకాలలో ఉంచారు. ఇంత గొప్పకవి కృషిని ప్రభుత్వము గుర్తించునట్లు చేసిన ఈవైశ్యకులమునకు కీర్తి లభిస్తుంది. ఇది చాలాగొప్ప కార్యము.

జీవకళసత్యనారాయణశర్మ
కడప, 14.2.98



Phone : 4941973

# అఖిలభారత్ షిర్డిక్షేత్ర సాయి భక్తనివాస్ ట్రస్ట్

పుష్పాంజలి హోటలు వెనుక, **షిర్డి**, (మహారాష్ట్ర)

అండర్ ది మేనేజ్‌మెంట్ ఆఫ్

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ

73-A, శాంతోమ్ హైరోడ్, చెన్నై - 600 028.




ఆర్యా!

శ్రీరామ దత్తాత్రేయుల కలియుగ అవతార పురుషుడే శ్రీ షిర్డిసాయిబాబా. సహృదయముతో వారిని నమ్మి ప్రార్థించువారికి వారివారి కోరికలను తీర్చు భగవంతుడితడు. సమాధినుంచే ఈయన భక్తులను దీవించెదరు. సాయిబాబాను దర్శించుటకు వచ్చు భక్తుల వసతి సౌకర్యార్థమై మన సంస్థ ఒక చక్కని వసతిగృహమును నిర్మించుటకు ఒక పథకము వేసియున్నది. ఈ వసతిగృహములో ధ్యాన మందిరము, లాకర్లతో కూడిన జనతా హాలు, మరియు అన్ని విధములైన ఆధునిక సౌకర్యములతో కూడిన సుమారు వంద రూములు, రెస్టారెంటు ఉండును.. ఈ భవన నిర్మాణమునకు సుమారు రెండుకోట్ల రూపాయలు వ్యయమగునని అంచనా వేయబడియున్నది. షిర్డి ఒక గొప్పక్షేత్రము. తిరుమలలో నుండు ఈ సంస్థ సత్రము పలువురి ప్రశంసలందుకొని యుండుట అందరికీ తెలిసిందే. ఈ ఆధునిక వసతులతో కూడిన భవన నిర్మాణమునకు భక్తులెల్లరు ధారాళముగా విరాళములు యిచ్చి ఈ పథకమును విజయవంతము చేయ ప్రార్థన. ఈ నిర్మాణము అన్ని కులాల ప్రాతిపదికన ఏర్పాటు గావించ బడినది. చెక్కులు/ డ్రాఫ్టులు చెన్నైలోనే మారునట్లుగా పంపవలయును.

## డొనేషన్ వివరములు :

| |
|---|
| 1) రూము డొనేషన్ : Rs. 1,01,116/– ఒక్కొక్కరికి 1 సం॥లో 25 రోజుల రూము వసతి.<br>ఇద్దరయితే చెరి : Rs. 60,116/– ఒకొక్కక్కరికి 1 సం॥లో 12 రోజుల రూము వసతి. |
| 2) చక్రవర్తి పోషకులు : Rs. 50,116/– 1 సం॥లో 10 రోజుల రూము వసతి. |
| 3) మహారాజ పోషకులు : Rs. 25,116/– 1 సం॥లో 5 రోజుల రూము వసతి. |
| 4) రాజ పోషకులు : Rs. 10,116/– 1 సం॥లో 3 రోజుల రూము వసతి. |
| 5) పోషకులు : Rs. 5,116/– 1 సం॥లో 2 రోజుల రూము వసతి. |
| 6) లాకర్ : Rs. 1,516/– డోనరు పేరు లాకరు మీద వ్రాయబడును. |

ఈ విరాళములు ఇన్కంట్యాక్సు సెక్షను (80G) క్రింద వరుమానపు పన్ను మినహాయింపు కలదు.

ఛైర్మన్
శ్రీ కె. రాధాకృష్ణయ్య, కల్లూరు.

ఫౌండరు & మేనేజింగ్ ట్రస్టీ
భక్తశిఖామణి శ్రీ R.R. నాథం

వి
వా
హ
ం

అనంతపురంజిల్లా తాడిపత్రి వైశ్యప్రముఖులూ, ప్రముఖబంగారునగల వ్యాపారులూ శ్రీ టంగుటూరుసదాశివయ్యశ్రేష్ఠిగారి ఏకైక కుమారులు చి॥ కృష్ణమోహన్ వివాహం, కర్నూలుజిల్లా అధ్వేణివైశ్యప్రముఖులు శ్రీ పి.పి ఇ. రామాంజనేయులుశ్రేష్ఠిగారి కుమార్తె చి॥ సౌమ్యలక్ష్మితో 31-1-1998వ తేదీన గుంతకల్లుపట్టణములోని శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవ్యాలయములో వైభవంగా జరిగింది.

# వైశ్యప్రబోధిని యాజమాన్యం, తదితర వివరాలు

## ఫారం 4 (8వ నిబంధన చూడండి)

| | | |
|---|---|---|
| 1. | ప్రచురణ స్థలం | : వాసవీ ప్రింటర్సు, జయనగర్ కాలనీ, కడప. |
| 2. | ఎంతకాలానికి ఒకసారి | |
| | ప్రచురణ జరిగేది | : నెలకు ఒకసారి |
| 3. | ముద్రాపకుని పేరు | : శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి |
| | జాతీయత | : భారతీయుడు |
| | చిరునామా | : 'వాసవీ భవన్', జయనగర్ కాలనీ, కడప - 516 002. |
| 4. | ప్రచురణకర్త పేరు | : పై విధంగానే |
| | జాతీయ | : " |
| | చిరునామా | : " |
| 5. | సంపాదకుని పేరు | : పై విధంగానే |
| | జాతీయ | : " |
| | చిరునామా | : " |

పైన పేర్కొన్న వివరములు అన్నియు యదార్థములు.

కడప.
14.3.1998

**సం॥ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి**
ప్రచురణకర్త, సంపాదకులు.

## ఇల్లు, ఫోను, వాహనము మొదలగువాటిలో ఏ రెండు ఉన్నా రిటర్ను దాఖలు చేయాల్సిందే

ఆదాయపుపన్నుచట్టములోని నూతన నిబంధనలప్రకారమూ :

టెలీఫోన్ ఉన్నవారూ, సెల్యులార్‌ఫోనే కాదు. మామూలుఫోను ఉన్నవారైనా,

రూల్సుప్రకారమూ స్థిరాస్తి గలవారూ- స్థిరాస్తిలో నివసించువారూ - స్థిరాస్తినిఅనుభవించువారూ - ఏదైనా స్థిరాస్థిలో 'పేయింగ్ గెస్టు'గా ఉన్నవారూ,

సొంతఇల్లు ఉన్న వారూ,

ఇల్లుఅమ్మినప్రతివారూ (మినహాయింపుకొఅకు)

ఫార్మ్‌హౌజు అనగా వ్యవసాయక్షేత్రములోనే ఇల్లు నిర్మించుకొని నివసించువారూ,- తమ రిటర్నులను దాఖలు చేయాలి.

ఇదివరకే రిటర్నులు దాఖలు చేసినవారు తిరిగి రిటర్నులు దాఖలు చేయాల్సిన అవసరములేదు.

ఈ మధ్య టెలిఫోన్లు ఉన్నవారికి ఆదాయపుపన్నుశాఖాధికారులు నోటీసులు పంపించిఉన్నారు.

ఇంటిని అమ్ముకొన్న ప్రతివారూ మినహాయింపుకొఅకు రిటర్నులు దాఖలు చేయడమేకాదు. ఆ అమ్మిన ఇంటివిలువ 5 లక్షల రూపాయలకు మించితే, ఆదాయపుపన్నుశాఖాధికారుల నుండీ, 'క్లియరెన్సు'ను కూడ పొందకతప్పదు.

27-6-1997వ తేదీన ఆదాయపుపన్నుశాఖాధికారులు ఒక 'నోటిఫికేషను' విడుదలచేశారు. భారతదేశములో పంద్రెండు పట్టణప్రాంతాలనూ - ఆ ప్రాంతాలలో ఉండవలసిన నేలపరిమితీనీ ఆ నోటిఫికేషనులో వివరించారు.

మనరాష్ట్రానికి సంబంధించి, హైద్రాబాద్‌నగరములో నివసించేవారికి ఈ నోటిఫికేషనులోని నిబంధనలు వర్తిస్తాయి. హైద్రాబాద్‌నగరపాలకసంస్థ శాసనమూ, సికింద్రాబాద్ కంటోన్మెంట్ అక్టుప్రకారమూ హైద్రాబాద్‌నగరములోనూ సికింద్రాబాద్ కంటోన్మెంట్ పరిధిలోనూగల 'సివిల్ ఏరియా'లోని గృహాలకు పై నోటిఫికేషన్‌లోని నిబంధనలు వర్తిస్తాయి. అంటే, హైద్రాబాద్, సికింద్రాబాద్ కంటోన్మెంట్ పరిధిలో పదకొండువందలు, అంతకు మించీ చదరపుఅడుగులవైశాల్యముగల గృహాలలో నివసించుప్రజలూ - ఒక్క నూటా ఇరవైఐదుచదరపుఅడుగులకు ఎక్కువ వైశాల్యముగల వ్యాపారసంబంధముగల ఆవరణలు గలవారూ రిటర్నులు దాఖలు చేయాలి. కిళ్ళీకొట్లు, పేపరు డబ్బాలు, అందుకు సంబంధించిన ఇతరములకూ ఈ నోటీఫికేషనులోని నిబంధనలు వర్తించవు.

1-4-1996 నుండీ 31-3-1997 వరకూ గల కాలములో ఆదాయపుపన్నుచట్టము 139 (1) సెక్షనులోని పై 'కండీషన్ల'లో ఏ రెండు 'కండీషన్లు' వర్తించినా, అట్టివారంతా, వారికి సంవత్సరములో ఆదాయము ఉన్నా లేకపోయినా రిటర్నును దాఖలు చేయాలి. ఆదాయంలేని ఇల్లు ఉన్నా అంటే అద్దెకు ఇవ్వని ఇల్లు ఉన్నా, టెలీఫోనుఉన్నా ఈ రెండింటిమీదా కలిపి ఆదాయములేని వారైనప్పటికీ రిటర్నును దాఖలు చేయాలి.

ఈ రిటర్నును గత (ఫిబ్రవరి) నెల 28వ తేదీలోగానే పంపాల్సిన ఉంది. ఫిబ్రవరి 28కి లోపు పంపనివారు ఇకముందైనా పంపాలి.

1-4-1996వ తేదీతో ప్రారంభమై 31-3-1997వ తేదీతో ముగిసిన సంవత్స రానికి ఇదివరకే రిటర్నును దాఖలు చేసిన వారు తిరిగి ఈ రిటర్నును దాఖలు చేయనవసరము లేదు. పై కాలమునకు సంబంధించిన రిటర్నును దాఖలు చేయని వారు పై కండీషను ప్రకారమూ రిటర్నును దాఖలు చేయాలి. దాఖలు చేయు విష యాన్ని ముందుగా తెలియపరచాలి.

ఈ నూతన నిబంధనక్రింద ఆదాయపు పన్నుశాఖవారు నోటీసును పంపిఉంటే, ఆ నోటీసుతోపాటు ఆదాయపుపన్నుశాఖ వారు 'ఫారం 2సి'ని పంపిఉంటారు. ఈ ఫారాన్ని పూర్తిచేసి పంపాలి. ఇదివరకే రిటర్నును దాఖలు చేసినవారు అందుకు సంబంధించిన వివరాలను తెలుపుతూ "నూతన నిబంధనలు మాకు వర్తించవు"- అని తెలియజేయాలి.

ఇల్లు ఉన్నదా? బండి ఉన్నదా? టెలీ ఫోను ఉన్నదా? విదేశీప్రయాణం చేశారా? విదేశీప్రయాణం విషయములో ఖర్చు పెట్టినారా? ఇంకా జీతము, ఇంటి ఆదా యము, వర్తకమూ లేక వృత్తిపరంగా లభించు నికరఆదాయము, మూలధనము మీద లభించే ఆదాయము ఇతరత్రా ఆదా యాలు, పై ఐదింటినీ కూడగా వచ్చే స్థూల ఆదాయము - చట్టపరంగా లభించే రాయితీలు - మినహాయింపులు తగ్గించి కట్టిన పన్నువివరాలు ఈ ఫారం 2సిలో విశదపరచాలి.

ఆదాయపుపన్నురేట్లు మారలేదు. కాబట్టి పాతరేట్లప్రకారమూ తాము కట్ట వలసిన పన్నును నిర్ణయించుకోవచ్చు. స్వంతగృహములో నివసించువారికి ఏ ఆదాయమూ ఉండదు. అద్దెకు ఇచ్చిన వారు ఆ అద్దెలను లెక్కించి, ఆఅద్దెల మొత్తములో నగరపాలకసంఘం వారికి చెల్లించేపన్నులూ, 5వభాగము మర మ్మత్తుల ఖర్చులకూ, ఆ ఇంటి నిర్మాణానికై తెచ్చిన అప్పులపై చెల్లించవలసిన వడ్డీల మొత్తమునూ మినహాయింపుల క్రింద తగ్గించవచ్చును.

జీతమునకు సంబంధించిన అన్ని వివరాలనూ పేర్కొనాలి. సాధారణంగా జీతంమీద ఆదాయాన్ని ఏ విధంగా లెక్కస్తామో, ఆ విధంగానే లెక్కించాలి. నికరజీతమును ఆ ఫారములో చూపాలి. వ్యాపారంద్వారా లభించే ఆదాయము కలవారు లాభమొత్తములో ఖర్చులు అన్నింటినీ తగ్గించి మిగిలిన లాభాన్ని మాత్రమే పై ఫారములో చూపాలి.

ఇక మూలధనలాభం గురించి. స్వల్ప కాలికలాభాలు, దీర్ఘకాలికలాభాలు అని ఈ మూలధనలాభాలు రెండు విధాలు. స్వల్పకాలికలాభాలను మాత్రమే స్థూల లేక నికరఆదాయములో కలపాలి. ఇరవై (20%) శాతము పన్నును చెల్లించాలి కాబట్టి దీర్ఘకాలికలాభాలను విడిగాచూపాలి.

ఎక్కువమంది ఉద్యోగస్తులు వారు కట్టవలసిన ఆదాయపుపన్నును తమ యజమానులే చెల్లిస్తున్నారు కాబట్టి తాము ప్రత్యేకంగా రిటర్నును దాఖలు చేయాల్సి ఉండదు అని అనుకునేవారున్నారు. ఇది వారి అపోహయే. ప్రతిఉద్యోగస్తుడూ రిటర్నును దాఖలు చేయాల్సిందే.

ఉద్యోగవిరమణ చేసినవారు కూడ రిటర్నును దాఖలు చేయాలి. పెన్షన్ తక్కువగా పొందువారు ఆదాయపుపన్ను విధింపుపరిమితికి రారు. అయినా వారు కూడ రిటర్నును దాఖలు చేయాల్సిందే. అట్టివారు వారికి లభించే పెన్షన్ మొత్తమునే కాక పెట్టుబడులమీద వచ్చే వడ్డీ మొదలగు వాటిని కూడ కలిపి ఆదాయాన్ని నిర్ణయించు కోవాలి.

హైద్రాబాద్‌నగరముతో కూడ - భారత దేశములోని పండ్రెండు పట్టణాలకే ఇప్ప టికి ఈ నిబంధన పరిమితమైనా, త్వరలోనే రాష్ట్రములోని అన్ని పట్టణాలకూ ఈ నిబంధనను వర్తింపజేసే అవకాశం ఉంది.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - శ్రీశైలం : 87140, 87114
తిరుపతి : 50030, పుట్టపర్తి : 87240, 87440,
తిరుమల : 77682, 79327

## వైశ్య యాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

### 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12 62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

12×12 రూముకు రూ.50000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

### 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 15×9 సైజుగల రూము దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును 2 రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును. 3 రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక బీముకు ఒక సైడు పేరు, ఫోటో వేయబడును. లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 15 రోజులు రూము ఖువ్వబడును. కొద్దిమందికి మాత్రమే అవకాశము.

రు 2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు 100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు 5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రికుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము 4.10.95 నుండి నిత్య భోజనములు, తాత్కాలికముగా వసతులు ఏర్పాటు చేసినాము వైశ్య యాత్రికులు ఉపయోగించుకొన కోర్తాము.

### వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. పోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించబడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. పోటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును.

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును.

రు 1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు 2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును రు 1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్ధినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును. కొద్దిమందికి తిరుమలలో కూడా 15 రోజులు రూము కేటాయించబడును

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. <u>శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్ధ మహా క్రతువు</u> పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును :- మొదటి రోజు శ్రీమన్నారాయణడు దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మి క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మి వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు అధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష ద్వీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## <u>ఇందులకై సమర్పించవలసిన విరాళములు</u>

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2 రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.
గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.
పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.3.98 నుండి 20.4.98 వరకు)

చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకంపన్ను మొత్తానికి చెక్కును వ్రాసి ఏప్రిల్ నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారులకు అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి. చెక్కుద్వారా కాకుండా చలానాద్వారా అమ్మకంపన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును ఏప్రిల్ నెల 20వ తేదీనగానీ, అంతకుముందుగా గానీ చేరునట్లుగా పంపాలి.

పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1998 ఫిబ్రవరి నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంట్లును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ మార్చినెల 31వ తేదీలోగా చేర్చాలి.

1998 ఫిబ్రవరి నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వనెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి ఈ మార్చి నెల 31వ తేదీలోగా చేర్చాలి.

మీరు ఆదాయపుపన్ను చట్టములోని 115K సెక్షన్ మేరకు లభించు లబ్ధిని పొందదలచుకొన్న చిల్లర వర్తకులా? అయితే, మీ వ్యాపారానికి సంబంధించిన స్టేట్‌మెంట్ ఫారము నెం. 4A లేక 4B ని తగిన ఆధారాలతో మీకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి ఈ మార్చి నెల 31వ తేదీలోగా చేర్చాలి.

మీరు ఈ క్రింది మూడు తరగతులలో ఏ తరగతికైనా చెంది ఇంతవరకూ ఆదాయపుపన్ను చట్టముక్రింద పొందవలసిన శాశ్వత ఖాతానెంబరు పొందనివారా? అయితే శాశ్వతఖాతానెంబరును పొందుటకు ఈ మార్చి నెల 31వ తేదీలోగా దరఖాస్తు చేయాలి.

1. గడచిన 1997-98 ఆర్థిక సంవత్సరములో 'నిల్' రేటుతో విధించదగు ఆదాయపుపన్ను మొత్తమునకు మించని ఆదాయము కలవారు.

2. 1997-98 ఆర్థిక సంవత్సరములో జరిగిన అమ్మకాల మొత్తమూ, టర్నోవరూ, గ్రాస్‌రిసిప్ట్సు రూ. 50,000/- లకు మించవచ్చునను పన్ను చెల్లింపుదారుడు.

3. ఇంతవరకూ శాశ్వతఖాతానెంబరును కేటాయించబడనివారు.

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by F. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.